





# జీవిత చరిత్ర

# రవీంద్ర నాథ్ టాగోర్ జీవిత చరిత్ర





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010007155

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# రవీంద్రనాథ టాగూరు
## జీవితచరిత్ర

రచయిత:

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1954



[ వెల 0—8—0

# మనవి

"భారతాధ్యాత్మిక ప్రభాభాగ్యమొక్క-
భరతజాతికిగాక యెవ్వరికిగలదు ?"

అన్న విజ్ఞానోక్తి యీనాటిది కాదు. ఏమహానీయుడో దీనిని తన రసన నమృతవాటికల జరించి సుధాపానమును జవిచూచిన తరుణమున తత్పీయూషాపానవిశేషమున వక్కాణించి యున్నాడు. అవి సువర్ణాక్షరములై భరతభూమిని వివిధ శిల్పనాచాతురితో మెఱయుచున్నవి. అంతేగాక సకలరత్న ప్రభా చటులాంబరంబైన హిమనగంబు ఆతపత్రంబుగను, భాగీరథీ సింధూనదీసతులు చేరి చెరియొకవంకను విమలవీచీ చామరంబులు వీవగను గభీరవారిధీశ్వరులు తూర్పుపడమరల పార్శ్వంబులందు నిలిచి సాహోనినాదంబులతో కైవారంబులొనర్పగను, ఆర్షసంతతివారైన ఋషిపుంగవులు సాంద్ర మేదుర కంఠస్వనంబులతో, ఉదాత్త-అనుదాత్త-స్వరంబులతో స్వస్తివాచనంబు లిడుచుండగను తన ముప్పదిమూడు కోట్లముద్దుబిడ్డలు మహామురిపెంబున తనయాజ్ఞశిరసావహించి నిరంతరము కరకమలంబుల మొగిడ్చియుండ, సింహాళద్వీపపీఠికాసీనయైన భరతమాత కంఠసీమను వెలయు వీరహారావళిలో దివిజులు సైతము దిగ్భ్రమనొందినట్లు తేజరిల్లుచున్నవి.

అయిన నేమి భారతమాత దాస్యశృంఖలములు విడగొట్టబడ లేదు. ఇది భారతీయుల దురదృష్ట మనవచ్చును.

ఏనాటికైన నీయాశలు తీరకపోవునని భారతీయు లాశించియే యున్నారు. తత్ఫలితమునకై ప్రథమవర్షమునకు చాతకము లాకొని జూచునట్లు, స్వాతివానకు ముత్తెపుజిప్పలునాలు కలజాచి యెదురుచూచుచున్నట్లున్నారు. అట్టి యాశలను దీర్ప మహనీయు లనేకు లుద్భవించి తమజీవితములను దేశమాతకు ధారవోసి పలుదెరంగుల విశ్వప్రయత్నములను చేసి కొంత విఫలులయ్యు నీమహోన్నతమైన యాశాలతల ద్రెంపలేక పునఃపునః ప్రయత్నము లాచరించుచునే యున్నారు.

అట్టివారి యాశయములను వినుటకన్న, వారి యుపన్యాసముల జదువుటకన్న, వారిగాథల నితరులనుండి యాలించి తుడిచివేయుటకన్న గ్రంథముఖమున వారిజీవితములను జనసామాన్యము చేతబట్టి కంఠస్థముగా గాకపోయినను వాచకమార్గమునైన జదివిరేని యందలి కొన్ని యంశంబులైనను పట్టుబడక మానవు. ఇట్టి యాశయమునే హృదయమున నిడుకొని దేశనాయకులలో నగ్రగణ్యు లనిపించుకొన్న నెహ్రూ మొదలైన పుణ్యపురుషుల జీవితచరిత్రములను వెలువరించి యున్నాము.

అంతతో విరమింపక సర్వజనసామాన్యమునకు సర్వతోముఖముగ, ఇతోధికముగ సేవలొనర్చి విగతజీవులై దివి నలంకరించిన మహాపురుషుల జీవితములనుగూడ జనసామా

న్యము విసుగు చెందకుండ స్వల్పకాలములో యామహాశయుల జీవితాశయములను దెలిసికొని కృతార్థులును చరితార్థులును కాగలరను విశ్వాసమున నట్టివారిలో భరతదేశమం దగ్రగణ్యు డనిపించుకొని నిన్న మొన్ననే దివి నలంకరించిన రవీంద్రనాథ టాగూరు మహాశయుని జీవితమును బ్రకటించి యాంధ్ర మహాశయుల చేతి కందిచ్చుచున్నాము. ఇందు కొంతవరకైన మాయాశయము నెరవేరి ప్రజాబాహుళ్యమున కుపకృతి కించిత్తైన జరిగేనేని ధన్యుల మగుదుము.

ఇట్లు,
ప్రకటనకర్త.

# రవీంద్రనాథ టాగూరు

## ఉపక్రమణిక

"శా. దేశద్రోహుల తూలనాడి జనుషాం
ధీభూతచేతస్కులన్
దేశీయానుచరాళి మేల్కొలిపి మా
తృక్షాంతల స్ఫారతే
జోశోభల్ బ్రకటించి భారతయశోం
శుక్షాత్రదివ్యప్రభా
దేశౌన్నత్యము వెల్లిగొల్పు సుకవీ
వీరాద్భుతశ్లోకముల్"

విశ్వప్రపంచమునకు విజ్ఞానఫలదంబును, వేదకల్పక ముద్భవించిన పాదును, సంకల్ప మాత్రంబుననే జగన్నిర్మాణ మొనర్పజాలిన తపోధనుల కాస్పదంబును, సత్యరక్షాదిదృఢ దీక్షితులగు హరిశ్చంద్రాదుల కేలిక భూమియు, పరశురామ, ద్రోణ, పాండవేయాది వీరులకు బుట్టినిల్లును, గాంగలహరీ తరంగంబులచే సకలపాపంబుల క్షాళిత మొనర్పజాలిన మాన్య భూమియు, శంకరాది మతాచార్యులకు జన్మభూమియు, భువ నైక పావనంబునైన యీభరతఖండమునందు, ఏదో యొక ప్రదేశమున నెప్పటి కప్పుడే యనేకమంది మహనీయు లుద్భ

వించి తమ మేధాపల్లవులచే దశదిశల యశశ్చంద్రికల గట్టు కొని సకలజనుల కేదో యొక విధముగ సేవజేసి పరమోప కారు లనిపించుకొని తమ యశఃకాయము నిట విడచి దివి కేగియు చిరస్మరణీయు లగుచున్నారు.

భరత ఖండమందు యిరువదవ శతాబ్దారంభమున ననేకమంది మహనీయులు బయలువెడలి దేశోద్ధరణము నకును, సంఘసేవకును, మానవజీవితమునకును, పలువిధం బుల సేవను జేయుచున్నారు. అట్టివారిలో నగ్రగణ్యు లన దగినవారు కొందఱుండిరి. వారిలో గూడ గొందరు దేశసేవ కులుగను, మఱికొందఱు సంఘసేవకులుగను, వేఱు కొందఱు రాజకీయ వేత్తలుగను, ఇంకను గొందఱు మతకర్తలుగను, మరికొందఱు భాషాప్రియులుగను, భాషా సేవకులుగను నున్నారు.

కాని సర్వమానవ జీవితమునకు, సకలవిషయంబు లందు సర్వసమానప్రతిపత్తితో జీవితాశయములను మర లించి సకల జనోపయోగకరంబులగు కార్యముల నాచరిం చినవా రరుదుగ దే యున్నారు. ఒకడు తత్త్వవేత్త యయ్యె నేని యతనికి రాజకీయపరిజ్ఞానము శూన్యము. మరొకడు రాజకీయవేత్త యయ్యెనేని సంఘసంస్కారణాభిలాష యతనికి మృగ్యము. వేఱొకడు భాషావేత్త యయ్యెనేని యతని కితర విషయములు స్వప్నకలితములు. అట్లుగాక నన్నివిధములైన కార్యములందును అందెవేసిన చేతులు లేకపో లేదు.

## జ న న ము

భారతదేశమందలి వర్తమాన కవిపుంగవులం దట్టి మేధావులు పలువు రున్నారు. వారిలో రవీంద్రనాథటాగూరు మహాశయు డొకడు. ఇతడు భారతభూమి కంతకును ఘన యశస్సు నాపాదింప దివినుండి భూమికి దిగిన బృహస్పతియో యన జనులచ్చెరువందు జీవితమును మానవ లోకోపకార మొనర్చుట కవతరించిన దేవతయోయన, భరతభూమి యందు మేధావంతు లెందరో పుట్టి భారతభూమి కపార యశం బార్జించుచు నార్జింపమన్న వంగదేశమున కంతకును మహాటాయమానంబై, కాళీమాహాదేవి పేరిట ప్రసిద్ధమై, భాగ్యవంతమై, నగరరాజంబులందు మేటియైన కలకత్తానగ రంబున క్రీ॥శ॥ 1861 వ సంవత్సరమున మే నెల 6 తేదీని జన్మించెను.

ప్రపంచమందు సర్వసాధారణముగా మానవజన్మ లభించుటయే దుస్తరము. అందు పూర్వసుకృతపరిపాకమున గాని పురుషుడై జన్మించుట తటస్థింపదు. అందు సకలశాస్త్ర విశారదుండగుటకుగాని, పరోపకార పరాయణుడగుటకుగాని దేశనాయకుడై జీవితపర్యంతమును దేశోద్ధరణకు వినియో గించుటకుగాని, మహాభాగ్యసంపన్నతకలకుటుంబమునజన్మించి సర్వవిద్యాపారంగతుడై దేశమంతటను విజ్ఞానప్రభలను వెద జల్లుటకుగాని, ఏదేనియొక మానవతావేశమున ప్రవేశించి

యందు విజయమొన్ది యుండుటకుగాని. మానవలోకమునందును దనయముగు కాడలలో నడచునట్లు చేయుటకు పరోపకారశక్తి యుద్భవిల్లుటకుగాని, తుదకు చిరకాలజీవియై ధర్మమార్గాను వర్తనమునను, న్యాయపథగమనంబునను జీవితము ధారవోసి స్వేచ్ఛావర్తనమున కనుకూలవాతావరణము ఏర్పడుటకు గాని యింకను తొల్లింటి సుకృత విశేషమే కారణమని పెద్దలు పలువిధంబుల ఘోషించి యుండుట భారతీయు లందఱకు విశదమేయైనను "ప్రమాదో ధీమతా మపి" యను న్యాయంబువలన గాబోలు మానవలోక మట్టి విజ్ఞానదీపికను ఏమఱుచుచు.

సర్వసాధారణముగా పులికడుపున పులిపిల్లయే పుట్టును గాని మేకపిల్ల పుట్టదుగదా! దీనికి సంబంధించిన దే మఱియొక సామెత తెలుగుభాషలో కలదు. "ఏగూటిచిలుక ఆ పలుకే పలుకు" నన్నది. ఈ రెండును బ్రహ్మలిఖితముల వలె గణింపబడుచు నవ్యభాషలోనికి గూడ పరివర్తనము నంది మహాఖ్యాతి నందియుండి చరిత్రాత్మకముగ కూడ కీర్తినంది నిలచియున్నవి.

ఈ మెతను ఋణికివుచ్చుకొన్నట్లు సుప్రసిద్ధమైన వంశమునందు జననమంది పవిత్రజీవనము నడపి తమవంశమునకు పేరుప్రఖ్యాతులను దెచ్చుటయేగాక తాను జన్మించిన జన్మభూమికిగూడ నపారయశ మార్జించిన వారు లెక్కకు మిక్కిలిగ నున్నారు.

అట్టి మహాసీయులలో లెక్కింపదగినవారిలో రవీంద్ర నాథటాగూరు మహాశయుడుకూడ నొకడు. ఇతనివంశీయులు సుప్రసిద్ధపండితులును, శాస్త్రవాదులును, విద్యావేత్తలును, సంఘసంస్కర్తలును, పరోపకారపారీణులున్నైయున్నారని చరిత్రలు చెప్పుచున్నవి. మన మెరిగియున్నంతవఱకు జెప్పు కొందము. టాగూరు మహాశయుని పితామహుడు(తాతగారు) ద్వారకనాథటాగూరు. ఈయన వంగరాష్ట్రమున నాటి కాలమున పేరొందిన దేశభక్తుడు, పరోపకారి, వివిధవిద్యా ప్రవీణుడు, పవిత్రవర్తనుడు, మహాధనసంపన్నుడు,సత్యదీక్షా నిరతుడు, సంస్కర్తలలో నగ్రగణ్యుడని వినుచున్నాము. రవీంద్రునిది జెవనాంకో ఠాకూరువంశము. వీరు చాలకాలము నుండి కలకత్తాయందే నివసించుచుండిరి. ద్వారకనాథ ఠాకూరుగారి కుమారుడు శ్రీ దేవేంద్రనాథఠాకూరుగారు ఈయన విద్యావేత్తయు. మతాభిమానియు, న్యాయవాదు లలో పేరొందినవాడు. నగుటయేగాక తన సత్ప్రవర్తనము చేతను, మతాభిమానమునను, పరోపకారపారీణతచేతను వంగదేశీయుల మన్ననలందుకొనుటయె గాక వారివలన 'మహర్షి' యని బిరుదందినాడు. దీనినిబట్టియే ఆయన యెంతమహాశాంతుతో తెలియుచున్నది. ఈయనకు పుత్ర త్రయము జన్మించెను. అందు జ్యేష్ఠుడు సత్యేంద్రనాథ టాగూరు. ద్వితీయుడు మనకథానాయకుడైన రవీంద్రనాథ టాగూరు. తృతీయుడు దేవేంద్రనాథ్. వీరు బ్రహ్మా విష్ణు మహేశ్వరులవలె మహాతేజస్సంపన్నులు

గను, సౌభ్రాతృత్వమున రామలక్ష్మణులపగిదిని తేజరిల్లుచు నైకమత్యంబున పాండవులబోలి వెలసిరి. ఏ కారణముననో రవీంద్రుడన్న మొదటినుండియు దేవేంద్రనాథటాగూరిగారి కపారప్రేమ. రవీంద్రుడు పదిసంవత్సరములలోపు వయసువాడై యుండగా యాతని మాతృదేవి భర్తను, పుత్రులను, యితర బంధువర్గమును వీడి దివి నలంకరించినది. రవీంద్రుడు మాతృవిహీనుడయ్యెను. అందువలన పిల్లలభార మంతయు దేవేంద్రనాథుడే వహించి యుండెను.

ఇచ్చట నొకవిషయము దేవేంద్రనాథునిగూర్చితప్పక చదువదగినది వ్రాయుచున్నాము. కష్టసుఖములు కావడికుండలవంటివని మనమందర మెఱింగియే యున్నాము. దేవేంద్రనాథటాగూరు సంతానవంతు డగుసరికి యాకుటుంబము మిగుల ధనసంపన్నముగా నున్నదని మీ రెరింగియున్నారు. కష్టము లెప్పుడునుఏకముఖముగ నేవచ్చును. ఒక వంక భార్యావియోగ దుఃఖము ననుభవించు దేవేంద్రనాథునకు గారణాంతరములచే ననతికాలములో ఋణములపా లగుటకూడ తటస్థించెను. రవీంద్రునితండ్రి మేధాశాలియు, ప్రతిభావంతుడును, శాంతివంతుడునగుట నించుకేనియు తత్తరపాటొందక నిర్మలచిత్తముతో తనబుద్ధిబలమును విద్యాసంపత్తిని ప్రోదిచేసుకొని చేతులమీదనే న్యాయార్జనము చేసి ఋణమంతయు దీర్చివైచి కుటుంబముయొక్క పేరుప్రతిష్ఠలు కొంచెమేని కొఱవడ

కుంప కోసెను. ప్రకాశమునకు కేడవచ్చునో యప్పుడు మహేశ్వరునకు దక్కను నొసంగుట తెలియదుకదా? ఇదియేకదా సృష్టివిచిత్రము.

దేవేంద్రనాథ ఠాగూరు యింద్రియ నిగ్రహణంబున ప్రసిద్ధుడైన మేటియగుటచేతనే యతనికి "మహర్షి" యను బిరుదు నామము సార్థకమయినది. ఇతడు రాజా రాజర్షి శ్రీరామమోహనరాయలవారి కాలములో నుండి యున్నట్లును, అతనితో గలసి మెలసి సకల విషయంబులందును బని చేసినట్లును దెలియవచ్చుచున్నది. అట్టి మహనీయులు పరస్పరము కలసి మెలసి పనిచేయుటచేతనే వారి ప్రవృత్తులును, ప్రవర్తనలును ప్రతిఫలను, నేటికిని చరిత్రాత్మక పీఠంబున సువర్ణచ్ఛాయలతో తాండవమాడు చున్నవి. రవీంద్రు డాయన యడుగుజాడలలో నడచి యున్నతిగన్న ప్రతిభాశాలి యగుటలో నాశ్చర్యమేమున్నది?

## విద్యాభ్యాసము

"విద్యా నామ నరస్య రూప మధికం
ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశః సుఖకరీ
విద్యా గురూణాం గురుః
విద్యా బంధుజనో విదేశగమనే
విద్యా పరాదేవతా

విద్యా సర్వస్వ ప్రాప్యతే న హీంధనం
విద్యావిహీనః పశుః"

ఈ న్యాయము ననుసరించియే మన దేశమందేగాక యితర దేశమందుగూడ బాలబాలికలకు విద్యాప్రాముఖ్యత యేర్పడినది. సర్వసాధారణముగా ప్రాచీనకాలమునుండియు బాలురకు అక్షరాభ్యాసమను శుభకర్మమును జేయవలెనను నియమమున్నది. అట్లే భరతఖండమందు బాలురను అయిదవ యేటపాఠశాలకంపుటద్వితీయాచారమైయున్నది. ఈనియమ ప్రణాళిక ననుసరించియే దేవేంద్రనాథుడు తన రెండవ కుమారుడైన రవీంద్రునకైదవయేడు రాగానే యక్షరాభ్యాస మహోత్సవ మొనరించి పాఠశాల కంపెను. తోడిబాలురతో పాఠశాలకు గొంతకాల మేగెను. కాని యేకారణముచేతనో తెలియదుగాని రవీంద్రునకు బడిచదు వంతగా రుచించినట్లు గాని, ఆసక్తియున్నట్లుగాని, నచ్చినట్లుగాని, కనుపించలేదు. దీనికి కొందఱు తండ్రి యితనిపై జూపు గారాబమనియు, మఱి కొందఱితని చిత్తవృత్తి యన్యాక్రాంతమై యున్నదనియు భావించువారు. ఇందు మొదటిది కారణము కాదని రవీంద్రుని తరువాత జీవితమువలన నెఱుంగవచ్చును ఇంక రెండవది కారణ మన్న కొంత నమ్మవచ్చును.

ఏలననగా పాఠశాలలలో నేడు చెప్పెడి విద్య కేవల ముదరపోషణకే యుపకరించుచున్న దనుట నిర్వివాదాంశము.

దాని కనుగుణముగ నచటియుపాధ్యాయులు కేవలము ధనార్జ
నాసక్తతతో విద్యగఱపువారనుటయు నతిశయోక్తిగాని,
అపహాస్యముగాని కాజాలదు. అందుచే సునిశిత మేధాశక్తి
గల రవీంద్రుని కాపాఠశాలయందలి ప్రణాళిక మొదలగు
కొన్ని సంగతులు నచ్చ లేమినట్లు చిత్త మన్యాక్రాంత మైన
దన్న నమ్మవలసిందే.

అంతమాత్రముచే రవీంద్రుడు విద్యావిముఖు డయ్యెనని
గాని, మందమతియనిగాని, యూహింపరాదు. అతని మేధా
శక్తి యద్వితీయమైనది. ఒకమాఱు చూచినదానిని, ఒక
మాఱు విన్నదానిని మఱచిపోవు టనునది యతని కెఱుంగనే
యెఱుంగడట. అందుచేతనే కాబోలు నొక చరిత్రకారుడు
ఠాగూరు వంశమందు బుట్టినవా రెవ్వరైనను దైవభక్తులు
గానో పండితకవులుగానో, చిత్రకారులుగనో, చారిత్రక పరి
శోధకులుగనో, అద్వితీయ ప్రతిభావంతమైన న్యాయవాది
గనో యుండవలసినదే యని నొక్కి వచించి యున్నాడు.

రవీంద్రుడు పాఠశాల కరుగుటయే మానివేసెను గాని
నిరంతరము తెలిసినను తెలియకపోయినను ఏదో యొక గ్రంథ
మును చదువుచునే యుండెడివాడు. అట్లు చదివినపుస్తకమునే
పదింబదిసారులు చదువు టలవాటయ్యెను. కొంత కాలమున
కా యలవాటు ఆహారము మొదలైనవికూడ ముట్టుటకు తీరు
బాటు లేనంతటి దీక్షగా మారెను. మఱికొలది కాలములోనే

వ్యసనముగ మారెను. అంతతో నతనికి లోకమే పాఠశాల
గను, ప్రకృతిచోద్యములే గ్రంథములుగ నయ్యెను. ఆతని
చిత్తవృత్తి క్రమక్రమముగా మారెను. ఇల్లువిడిచి బయట
కేగినచో ననేకములైన దృశ్యములు కనబడునవియు, విజన
ప్రదేశములందును, జనబాహుళ్యముగల తావులందును నవి
యింకను నధికముగా గన్పట్టుననియు నతనికి దోచెను.

ఇంటివద్దనున్నంతసేపును ఒక్కనిమిషమేనికాలమును
వ్యర్థమును చేయక గ్రంథపఠనమునకే వ్యయించువాడు. ఆ
చదివిన గ్రంథమునందలి విషయములను తలకెక్కించుకొని
తెలియనివానిని పెద్దలవలన తెలుసుకొనుచుండువాడు. అందుచే
నతనికి గొంతకాలమునకు నద్వితీయవిజ్ఞానశక్తియు, ప్రతిభా
విజృంభణమును బాల్యముననేయలనడి విశ్వమానవ ప్రపంచ
మున కెఱుకబడదగిన మార్గమునకు దెచ్చినవి. అయితే యివి
'గురుశుశ్రూషయా విద్యా' యనున్యాయమున కెదురుచుక్క
యైనను దీనిని సత్పథమున నడిపించుకొనదగు ప్రతిభయతనికి
మొదటనే పట్టువడినది.

ఇంచుకేనియు సంశయింపక రవీంద్రుని విద్యాసము
పార్జనాప్రాభవము గురుముఖమున నలవడినటి కాదని చాట
వచ్చును. అయినచో దాని నేమనవలెను? స్వయంకృషిచే
నార్జించినది కావున రవీంద్రుని పోతనవలెనే సహజపండితు
డందుమా? అదిదుస్సాధ్యము. పోతన సహజపాండితి యలౌకి

సామాన్యమనియునసాధ్యమనిజనముచే తెలియబడినది. ఇంక దీనిని మాటిమాటికి అనుభవ పూర్వకమైన జ్ఞానప్రబోధ మనవచ్చును. ఇంత బాల్యమందేమి? జ్ఞానప్రబోధమేమి యని వింతపడనక్కఱలేదు. చరిత్ర కాలములను వివరించి తెలుపు సద్గ్రంధములను జదివితిమేని యిది వింతగా కన్పట్టకుండును.

రవీంద్రుని తండ్రి కుమారుని యిట్టి పరిస్థితులను గమనించుచుకూడ లోకానుకూల్యమైన విద్యాభ్యాసముపాఠ్యకు ప్రోత్సహింపలేదు. విద్యాప్రబోధమును హెచ్చు మందలింపలేదు. అంతేగాక మహదానందము నందువాడు. రవీంద్రుని కపుడు బాల్యయౌవనములు నేడు నేటని కలహించు పడునైదేండ్ల ప్రాయము. అతడు విద్యార్థిగానున్న కాలములో ప్రతిదినము ప్రాతస్సాయంసమయముల నందలి తోట సమీపమందున్న జానపదంబులకు బోయి యచటి ప్రకృతిచిత్రములను, మానవ ప్రకృతులలోని సహజప్రవర్తనలను, వివిధ నైజములను, నైతికములను గమనించుచుండువాడు.

అది యతని జ్ఞానప్రబోధమునకు పునాది యయ్యెను. మఱియు రవీంద్రుడు కొన్ని సమయములందు తన తండ్రితో కూడ వివిధ ప్రయాణములను, సంగీతటాకనిర్ఘరదీర్ఘి

కలకును, సకలధాతు పరికరంబులకును, సిఖలౌషధీవర్గము నకును, అనుపమానలోహ నిధానములకును, సకలమణిగణ నికరంబులకును నిలయమైనహిమవన్నగంబున కరిగి ప్రకృతి చోద్యంబులను గమనించి వచ్చుచుండువాడు. పాఠశాలయం దభ్యసించిన విద్యాజ్ఞానముకంటె రవీంద్రునకు స్వయముగా నార్జించిన ప్రకృతివిద్యాజ్ఞానమే బలవత్తరమై యతని భావి జీవితమునకు గీటురాయియై కమలములు సూర్యోదయంబు నకు గన్నులు తెఱచియుండునట్లు ప్రకృతిభావంబులకు రవీంద్రుని బుద్ధి వికాసము నొందెను.

దేవేంద్రనాథుని జాగ్రత్సంరక్షణక్రింద పెరుగుటచే తను, నియమితవర్తనము కలవాడౌటచేతను, సుగుణసౌజన్యములు రవీంద్రున కగ్గుబాలతో బోసినట్లయ్యెను. అది యటుండ నతని జ్ఞానప్రబోధనాశక్తియు, ప్రకృతి పరిశోధనా సక్తియు కొలదికాలములోనే భాషాప్రపంచమునకు వంగి తిన్నగా యది సెలయేటి ప్రవాహంబుపగిది మెల్లమెల్లన కవితారూపమున పరిణమించెను. అతని ప్రకృతితత్వ మంతయు భావోద్రేకమున వెల్లువయై కవితాప్రవాహమున నిమ్నోన్నత ప్రదేశంబులబరుగిడుగంగాస్రవంతినివలెనైనది.

రవీంద్రుని యద్వితీయమేధాశక్తి కవితారంగమున కడుగిడినతోడనే ముందాతడు వచనరచనమున శారం

భించెను. ఆ వచనరచన ధారాళముగను సందర్భశుద్ధిగను, రసవృత్తిగను కొంతికాలము నడచినది. అందు రవీంద్రుడు వెలువరించిన యనేకవిషయములు ఎంతపరిశోధన సల్పినను అనుభవసిద్ధులైన పెక్కులు వయోవృద్ధులు వానియాంతర్యము నెఱుంగజాలక పోయిరట. అతని వచనరచనా కౌశలము నిర్దుష్టమని వంగదేశీయులలో ప్రసిద్ధులైన పండితులు కొందఱు వక్కాణింప మొదలిడిరట.

తరువాత కొలదికాలములోనే రవీంద్రుడు గీతములను కీర్తనలను పెక్కింటిని రచించెను. ఆతని కవితానైపుణికి మూలకందము లేవో తెలిసికొనవలయునని పలువురు ప్రముఖులు యత్నించి తెలియలేక తుదకు రవీంద్రుడు మున్ముందు భరతఖండమందలి కవిపుంగవులలో నొకడు కాగలడని విశ్వసించి యాశీర్వదింప నుంకించిరట. దేవేంద్రనాథుని విశుద్ధ జీవనమును పవిత్రవర్తనమును, ప్రకృతితత్త్వజ్ఞానంబును అనుదినసంపర్కవశంబున రవీంద్రునకు మార్గదర్శకము లయ్యెననియు, మహర్షి దేవేంద్రనాథుని శిక్షాపరిణామ ఫలంబులుగ నబ్బిన విజ్ఞానసౌశీల్యమును, దైవభక్తియు, దేశాభిమానంబును, యాధ్యాత్మిక ప్రవచనానైపుణియు రవీంద్రుని భావ్యభివృద్ధికి గారణములైనవి. అంతేగాక రవీంద్రుడు రచించిన ఆధ్యాత్మికసంకీర్తన లందును, మఱికొన్ని యితరగ్రంథములందును ఆయా తత్త్వములన్నియు మనుజుని వెనుక క్రీనీడవలె గోచరించును.

కవిత్వమనగా మనోఫలకమున తాండవించెడి విషయములను, మహోదారముగా స్ఫురించు భావముల ద్వాంతరలను తాను గ్రహించిన పలువిధంబులగు సంశయములను వాగ్రూపకముగానో, లిఖితరూపకముగానో బహిరంగముగా వెలువరించి ప్రకటించుట. అంతియేగాని శబ్దరత్నాకరములను, బాలవ్యాకరణములను, అమరకోశమును, సులక్షణసారాది లక్షణగ్రంథములను యెదుట నుంచుకొని శబ్దపరీక్ష చేసి యన్వయక్రమమును క్రోడీకరించి, గణములను పట్టి పల్లార్చి యతిప్రాసలను దుర్గతికము లొనర్చి చేంతాళ్ళవంటి సమాసములతో నురిపోసి కోశంబులందలి పదములను త్రోసి త్రోసి వాగ్దేవిని దిగ్బంధన మొనర్చుట కవిత్వముకానేరదు.

అదియునుగాక లిల్లేలపదంబుల నేరి కల్లబొల్లి మాటలను చేర్చి కల్పనాచమత్కృతిని దొంగిలించి వ్యాకరణ సూత్రములను త్రెంపి రసమును నీరసింపజేసి యవయవంబుల నరికినట్లు పదంబులను పచ్చడి చేసి యం దం దతికించుటయు కవిత్వము కానేరదు. హృదయఫలకంబున తాండవించిన భావపుంజము నప్పటి కప్పుడే గొలుసులుగ నతికించి పెండ్లి పందిరిలో చాందినీకి వ్రేలాడగట్టు రంగురంగుల కాకితపుటల్లిక త్రాళ్ళవలె మనోఫలకంబున చిత్రించుకొనుట. ఇందు పలువిధంబులయిన భేదము లున్నవి. ముఖ్యముగా కవిత్వము పద్య గద్యాత్మకములను రెండు తెరంగులుగ నుండెను.

పద్యకవిత్వమునందు గొందఱకును, గద్యకవిత్వము నందు గొందఱకును శక్తి యలవడును. ఉభయములయందు నొక్కే విధమైన శక్తి కలవా రరుదు. ప్రాచీనకవిపుంగవులలో గాళిదాసు రెండింటియందును అందె వేసికోదగినవాడు. దేశ భాషాకవిత్వమందు ముఖ్యముగా నాంధ్రమందు నన్నయ్య తిక్కన పెద్దనసూరన్న మొదలయినవా రద్వితీయులు. వచనరచనమునందు కూడ నట్లే కొందఱున్నారు. వీరివలెనే వంగభాషలో రవీంద్రుడును పేర్కొనదగినవాడు.

రవీంద్రునకు మిగులతరుణప్రాయమందే మంచియాచారములును, ఆధ్యాత్మికావేశమును మతచర్చాభిమానమును అలవడినవి, అతనిదృష్టి నిరంతరము పైవానియందే కేంద్రీకరింపజేసినను భాషావిషయంబున సదా మనస్సు పనిచేయుచునే యుండెది.

## సత్ప్రవర్తనము

“జనకుని పూజలం గడుప్రసన్నత జేయు
నతండు పుత్రు డే
వనిత మెలంగు భర్తృవశవర్తినియై
యది సత్కళత్ర మే
జనుడు విపత్తిసౌఖ్య సదృశక్రియుడో
యాతడు మిత్రు డీత్రయం

బును జగతిన్ లభించు కడుపుణ్యము
జేసిన యట్టివారికిన్."

రవీంద్రుని వయస్సు కాలక్రమమున వృద్ధినందినట్లే యతని మనస్సంకల్పములును, మహోన్న తాదర్శములును సత్ప్రవర్తనయు క్షణక్షణమును ముందంజవేయుచు పురోగమనమును సాగించుచు వర్ధిల్లుచుండెను. రవీంద్రు డిపుడు సర్వకాల సర్వావస్థలందును భాషావిషయంబులనే తలపోయుచు నిరంతరము కవితాగానము చేయుటయందే గడపు టారంభించెను. కాని యాసుశీలుడు నిండుజవ్వనుడు కాకపోయినను యౌవనారంభముచే తొలుకాడు తన దివ్యతేజస్సంపన్నత్వముచే చూపరుల నాకర్షించుచుండెను. ఇతని నెక్కుడుగా వంగదేశీయు లాకర్షించుటకును, ఆదరించుటకును ప్రధానమైనది వేరొక కారణముకూడ గలదు. రవీంద్రుడు పసితనము నుండియు సంగీతమన్న చెవిగోసికొనెడువాడు. అట్లని గాత్రజంత్రముల కూతలువిన్న పరుగిడిపోవు నలవాటు అతని కెన్నడును లేదు. కాని ప్రశాంతస్థలమున గూరుచుండి శాంత వాతావరణమున ప్రకృతిదృశ్యములను గాంచుచు ప్రకృతి కాంత కోయిల స్వనమును, ఆయాప్రదేశములందు కొన్ని విధములైన చెట్లు గభీరముగా వినిపింపజేయు నాలాపధ్వనుల నాలకించుచు నట్లే యుండువాడు.

ఒకప్పు డాయూ ప్రాంతములం దొంటరిగ తిరుగాడు
నప్పుడు తాను వినిన ప్రకృతిరమణి కోయిలకంఠమును సంగీ
తపుచెట్లనుండి వచ్చు శ్రుతిధ్వనులను అనుకరించువాడు.
అదియే క్రమక్రమముగా నామేధానిధిని గానాభ్యాసవిధికి
ప్రోత్సహించినది. అంతటితో నుపేక్షింపక దైవదత్తంబని
తలంచి కాలోలు గానవిద్యయం దపారమైన ప్రేముడిచే దీక్ష
బూని కృషిచేసి యందుగూడ వలసినంత పాండిత్యము
నార్జించియూ శేముషీవిభవంబునక్కరకువచ్చుసమయములందు
వాడుకొనువాడు. మేధావంతులు పట్టినపట్టు వీడ కెంతటి
ఘనకార్యమైన సాధించగల రనుట కిది యొక ప్రబల
నిదర్శనము కాదా ?

రవీంద్రుడు కవితాగోష్ఠిలో కాలము గడపుచున్నసమ
యములందు కంటికి గన్పట్టు ప్రతివిషయమును కేవల వర్ణన
లతో నాపక ప్రకృతి భావములకే యెక్కువ ప్రాధాన్య
మిచ్చువాడు. సాధారణముగా కవియైనవానికి రసపిపాసు
లెక్కుడుగా నుండును. దీనినిగురించి భాషాప్రపంచమున నొక
చిత్రమైన గాథకలదు. కవితాకన్యక వ్యాకరణశాస్త్రమును
జదివిన పండితుని తండ్రిగా భావించి యతనికడ జేరదనియు,
తర్కశాస్త్రము నభ్యసించినవానిని సోదరునిగా దలంచి
యాతనివంక కేగదనియు, మీమాంసాస్త్రజ్ఞుని నపుంసకునిగా
నెంచి యతని మొగము చూడనొల్లదనియు, వేదవిద్యా
పారంగతుని కేవలము చండాలునితో సమానునిగా

నూహించి యతనికి దూరముగా నుండుననియు, కావ్య నాట
కాలంకార సహితీవిదుడై రసజ్ఞుడైనవానిని స్వయముగా
తనంతదానే పైకొని వరించు ననియు ప్రాచీనులేగాక
యర్వాచీనులుగూడ వచింపుచున్నారు.

దీని నిజానిజములతో మనకు నిమిత్తములేదు. ఇప్పు
డది యప్రస్తుత ప్రశంస. పెద్దలపలుకులుగాన విశ్వసింతము.
కాని నేఁటికిని ప్రతిదేశమందును సుప్రసిద్ధులైన కవీశానులలో
జాలవఱకు రసపిపాసువులును, రసానుభవమును స్థలకాలభేదం
బులు లేక చవిచూచి వహ్వా యనువారు నున్నారను విషయ
మును ప్రతివారును అంగీకరింపవలసినదే. కవియైన ప్రతి
వాడును అట్లుగా లేడనియు లోకము ఋజువు చేయుచున్నది.
కావున పెద్దలపల్కులను పెడచెవిని బెట్టక విశ్వసింతము.

ఈ విషయమున రవీంద్రుని వర్ణనము కాలమునకు
వయస్సునకు, వర్తనమునకు, ప్రజలకు, మిత్రులకు, బంధువులకు
మక్కువగా కన్పట్టు నడవడి కలవాడయ్యెనని చెప్పుట
సాహసముకాదు. రవీంద్రు డెప్పుడు నవయౌవ్వనంబునతోలు
కాడుచు మిసమిసలాడుచు మిసిమికాంతివంటి దేహచ్ఛాయ
తో, నూనూగుమీసంబుతో, హొయలుదీర్చిన మందగమ
నంబుతో మెలికలు దిరిగిన భుజాదండములతో నుండుటయే
గాక నిరంతరము కవితామణితో సయ్యాటలాడుచుండెను
గదా! అతని ప్రక్కశీతల్పము సర్వదా కవితారమణియు

లలామ కనుంగున్న హేతుపాత్రైన ప్రస్తుతిలలామమణియందె
కదా లీనమై యున్నది. అత్తరుణమున నతఁ డెల్లు విపరీత
వర్తనుడు కాఁగలఁడను సందియమును వైత్రిలోకము పడి
యుండుట సహజమేయైనను యతని పరసగముల నుండువారు
గుర్తెఱుంగరా?

ఇహలోకమున మానవునకు కల్పింపబడిన నాలుగు
దశలలోను మిగుల ప్రశస్తకలితంబగు నిండుజవ్వనంబున
నున్న రవీంద్రుడు కొంచెమైనను ఏవేళయందైనను తనచిత్త
మును విషయనిబద్ధముగానీక యింద్రియవశీకరణమందు
అనన్యసాధారణమైన నిగ్రహశక్తిని జూపువాడు. ఈనిగ్రహ
శక్తినిహరించు సంగసంకల్పము మొదలయిన విషయేంద్రియ
భావముల నాతడరికట్టగలిగినాడనుటలో నించుకేనియు
శంకింప వీలులేదు. ప్రతిదినమందును జరుపు నిత్యనైమిత్తి
కాది చర్యలందుగూడ నతడు సదా ఉన్నతాదర్శములనే
ప్రకటించుచు, ప్రకటించువానినే యనుసరించుచు, అనుస
రించువానినే యాచరణలో బెట్టుచు నుండువాడు. అతని
మేధాప్రతిపత్తి యద్వితీయమైనదని చెప్పుట కావంతయు
శంకించినవారు వంగదేశమునం దెచ్చటనుగూడ లేరన
వచ్చును.

ఆమేధాశాలి తాను చూచిన విషయంబులను, వినిన
సంగతులను గోచరించిన ప్రతియంశములను యెట్టివిషమావస్థ

యందైనను, యెట్టిదుర్గమవిషయాంతరము నందైనను తన
సునిశితబుద్ధిని ప్రసరింపజేసి యనుక్షణమునందే తత్త్వాంశ
మును నతిసులభముగ నవలీల గ్రహించువాడు. అంతేగాక
నత డుపలక్షించిన విషయముల నన్నింటిని జీర్ణము చేసికొని
దివ్యమైన ఋషివృత్తినే సర్వసమయములందు ననుకరించుచు
నుండువాడు. అతనికి విషయలోలత్వ మెట్లలవడును?

రవీంద్రుడు బాల్యమునుండియు ననుభవసిద్ధమయిన
విద్యార్థనమును దానికితగిన సత్ప్రవర్తనయు, దానికనుగుణ్య
మయిన కవితాగోష్ఠియు, దానికి వన్నెదెచ్చు ఋషివృత్తిని,
యద్దానిని బ్రోదిసేయు మతసన్నివేశమును నతిసులభముగ
నలవఱచుకొన్నవాడు. అతనికి తనపూర్వులవలెనే బ్రహ్మ
సమాజమతమన్నను, తన్మతాభిమానులన్నను, తన్మతకర్త
లన్నను, తదనుయాయులన్నను గౌరవము మెండు. అక్కా
రణమున మతవిషయమునందుగూడ తన సునిశితమనీషిత్వమును
ప్రవేశపెట్టి యేకాంతవాసంబునందుగాని, బహిరంగ ప్రదేశ
ములందుగాని యున్నను మతచర్చల గావించుచు తన పెద్దల
యడుగుజాడనే పోవ కృతనిశ్చయుడై బ్రహ్మసమాజమన్న
చంకలను గొట్టువాడు. రవీంద్రుని తాత ద్వారకనాథ
టాగూరు, తండ్రి దేవేంద్రనాథటాగూరు నిద్దరును గూడ
బ్రాహ్మమతాభిమానులే. అందు రవీంద్రుని తండ్రి యామత
మును వంగదేశమున పలుతావులందు ప్రోత్సహించి స్వయ

ముగా ప్రచారముచేసి వంగదేశీయుల నభివాదనములను వందనపరంపరల సంపాదించెను. తండ్రివలెనే పుత్రుడును యామార్గమున నడువ నుద్యమించెను.

ఈమహానీయు నింతటినుండి రవీంద్రకవిచంద్రు డందము, మొదటి వచనరచనముతో నారంభించిన యతని కవితాప్రసక్తి గీతామార్గమునను, పద్యవీచికలందును ప్రసరింప జొచ్చెను. అతని కవిత్వమునం దొకప్రక్క శాంతిత్వము వేరొకవంక ప్రకృతితత్త్వము, మరొకవంక నహింసాతత్త్వము యింకొకవైపున సత్స్వభావానువర్తిత్వము కలిగి వంకరలు లేక సాగ నారంభించినది. అన్నిటికంటెను మించిన సద్భావము జాతీయతా సన్నివేశము. అది ప్రతిగీతయందును ప్రతికీర్తనయందును, ప్రతిపద్యమునందును తొలుకాడుచుండును. అనతికాలముననే యీతడు వంగదేశీయులచే 'రవిప్రసారంబుతగులని తావులు కలవుగాని రవీంద్రకవి మేధాప్రసారితములేని తావులు లేవని జాతీయ కవీశానులలో నగ్రస్థాన మందగలడని మన్నన లందియుండెను.

అత్యంతశిరీషమార్దవములై, సుధామధురములై, జగజ్జేగీయమానంబులయిన యిక్కవిశిరోమణి పద్యరత్నములును, గీతాగుచ్ఛములునుకీర్తనలసంపుటియునను రాగసక్తులగుచదువరుల కెల్ల నాదరణీయంబులగుటయేకాక నీతని స్వేనాకథలు

చిత్రాచిత్రితిములై సరస భూయిష్ఠములై, కల్పనాసక్త లకును, నీతివంతులకును, సంస్కార నియతులకును, చిత్ర కళాభిమానులకును ప్రాభవప్రదంబులైనవి మఱియు నాతి కఠినములై బాలబాలికల హృదయసీమలందుగూడ బహు విధంబులయిన పరివర్తనములను దెచ్చునంతటి సులభశైలిలో బహిర్గతము లగుచుండెడివి.

అతి శ్రావ్యంబులును సగళపదజాల భూయిష్టంబు లును గానకళానిబద్ధపదయుగళంబులు గల నీమహాకవి నిర్మిత కీర్తనలు భక్తినివేశులగు నాధ్యాత్మికులకు ప్రియతమంబు లగుటయేగాక వంగదేశమతచారిత్రమునం దొక యదృశ్య పూర్వంబును, అదృష్టపూర్వంబునైన మార్పును గల్పించి నవి. అవియే బ్రహ్మసమాజ మతపరివ్యాప్తికి మూలకందములై ముఖ్యసాధనములై రవీంద్రుని యశశ్చంద్రికలను దశదిశలను చాటజాలునవియై యచంచలమార్గమున నజ్ఞానుల కగమ్య మార్గములుగ నుండెడివి.

ఆ కీర్తనలను ప్రాతస్సాయంసమయములిం దన్నివీధు లందును నన్నిమతసన్నివేశ స్థానములందును మిగుల నావేశ ముతో ననేకులచే పునరావృత్తి చేయబడుచుండెడిని. అందు వలననే రవీంద్రుడు బ్రహ్మసమాజము నెడల ప్రజానురాగము నార్జించెను.

## దే శ ప ర్య ట న ము

"ఆపదలందు ధైర్యగుణ మంచిత
సంపదలందు తాల్మియున్
భూవనభాంతగాశముల ప్రస్ఫుల
వాక్చతురత్వ మాజి బా
హాబలశ క్తియున్ యశమునం దను
శక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ ప్రకృతిజన్య
గుణంబులు సజ్జనాళికిన్."

ప్రపంచమున ప్రతివారును విజ్ఞాన మార్జించుట కనేక సాధనములు కలవు. అందు ముఖ్యముగా పేర్కొనదగినవి దేశపర్యటనము, విద్య, పరిశోధనాశక్తి మొదలగునవి. వానిలో సర్వవిధముల నుపయుక్తమైనది పర్యటనము. ఎన్ని వేల పుస్తకములను జదివి యెంత జీర్ణము చేసికొన్నను కొలది యర్థదేశపర్యటనమునకు సాటిగాదు. దేశపర్యటన మునం దనేకవిధములైన ప్రవృత్తులు, వివిధప్రకృతులు గల మానవకోటి, విచిత్రాకృతులు గల ప్రకృతిసంపత్తు, అనేకములైన రామణీయకములు, పలువురు పెద్దలు, పిన్నలు, పండితులు, పామరులు, జ్ఞానులు అజ్ఞానులు, రోగులు, భోగులు, భాగ్యవంతులు, బిచ్చగాండ్రు శాంతులు, ముక్కోపులు నీవిధముగా వివిధంబులైన విశేషాంశ

ములు కండ్లకు గోచరించి, వానియందలి గౌరవాగౌరవముల పరామర్శ, న్యూనాధిక్యతల విచక్షణ, వానిపరివర్తనములు, ఆలోచనములు. హృదయసీమను కలవరపెట్టి మానవుని యొక విధముగ నావేశాపూరితునిగ జేయును. దానివలన ననేకవిధంబులుగ విజ్ఞానవల్లరులు హృదయసీమ నుద్భవించి మరింత ప్రోత్సాహ మిచ్చును.

విద్యాభ్యాస మట్లుగాక యేదో యొక సముచిత మార్గమునకు మానవుని గొంపోయి విడచును. ఆ మార్గము దప్ప వేరుమార్గంబును కాన లేడు. అందుచేతనే చదివిన యంశములు మఱచుటను పుస్తకాపేక్ష యనిరి. అంతేకాక విద్యాసముపార్జనము వలన కలిగిన జ్ఞానవల్లికలు కొలది కాలములోనే పూత పూచి కాయలు కాచి పండు ఫలించి యవి యేగాలితాకుడుకో రాలిపోయి వల్లికనే యొకప్పుడు శూన్యము చేయును. అందువలననే విద్యాసముపార్జనా ప్రాభవముకంటె దేశపర్యటన ప్రతిభయే యాధిక్యత నందు చున్నదని పరిజ్ఞానులు ఘోషించుటయేగాక పదే పదే నొక్కి చెప్పుచున్నారు.

ఇంక పరిశోధనాశక్తిని పరిశీలింతము. దానివలన దేశ పర్యటనమువంటి విజ్ఞానము లభించక పోయినను చాలినంత యవకాశము, తిరుగ గలిగినంత జోటు, నలసినన్ని పరికరములు కలిగియున్నను స్థానములు తగినన్ని లభించనినాడు శ్రమయుం

తయు శూన్యమే యగును. ఆశయంతయు గగనసదృశంబగును. అట్టిచో దానిని విశేషాంశముగ జెప్పవలనుపడదు గదా పైసాన కాశములన్నియు లభించినప్పటికిని మానవునకు పరిశోధనయందాసయేక్షణమైన క్షీణించినచో తక్కినదంతయు బూడిదలో బోసిన పన్నీరే యగును.

ఇట్టి విజ్ఞానదాయిత్వము, మహత్తరతత్వముదానియందున్నదని పిన్నవయసువాడైన రవీంద్రటాగూరు గుర్తించెనో యన దేశపర్యటనమునకు గడంగెను. ఆపర్యటనమునందు గూడ భాషాదేవిని విస్మరింపక భాషాసేవ చేయుచునే యుండెను. రవీంద్రుడు కేవలము మేధాసంపన్నుడేగాక యకుంఠితమైన పట్టుదల దీక్షయుగలవాడు. లేనిచో నింటినుండి కాలుకదలుప వలసినంత అవసరము లేకపోయినను, కేవలము విజ్ఞానమార్జించు నుత్సాహముతోనే బయలుదేరి మున్ముందు భారతభూమియందు పర్యటనమునందు కాలిడెను. అయితే "క్షణక్షణముల్ జవరాంద్ర చిత్తముల్" అన్నట్లు నిరంతరము మానసము నిలకడగానుండక మానవుని చిత్తవృత్తి మార్చుచుండునని మన మెఱింగినదే.

మన దేశమున దేశపర్యటనమువలన విజ్ఞానులైనవారు పందొమ్మిదవ శతాబ్దమునగూడ గొందఱు కలరు. కొందఱు

ద్విచక్రశకటంబులపై యీ విశాలప్రపంచమును దిరిగిరి. మరి కొందఱు తేలికలో కొంతగడచినపిదప విముఖు లగుచుండిరి.

రవీంద్రుడు తొలుత హిందూస్థాన మంతయు పర్యటన మొనర్చెను. అందందలి వివిధవిషయంబుల నెప్పటి కప్పుడే మనస్సున పదిలపఱచుకొని యేకముఖమున చర్చలను జరుపుచు తుదకు నానా దేశీయ భాషా చార వ్యవహారంబులను జీర్ణించుకొనెను. అంతేగాక తాను తిరిగిన ప్రదేశమందలి వివిధంబులైన చిత్రాతిచిత్రములను లిఖితమున వ్రాసి పత్రికలలో బ్రకటించువాడు. కొంత కాల మట్లుగడచినపిదప నాయా సర్వవిషయంబు లందలి సారమును ప్రజలకు దెలుపుటకు వాని నన్నిటిని మననము చేసుకొనువాడు.

మఱియు నత డేయుద్యమము నారంభించినను కడ వఱకు చూడనిదే విడచువాడు కాడు. అతనికి దేశపర్యటనము కన్న ముందు కొంత వాచాలత యేర్పడినను నది లెక్కగొన వీలులేనిది. ఈసమయంబున వంగ దేశమువం దొక యలజడి బయలు దేరినది. అది వంగ దేశ విభజనము. ఆయుద్యమమున కలుగజేసికొన్న వృద్ధులైన మాతాపితరుల మనస్సున కలజడి గలిగించిన వాడ నగుదునని దానివలక బో లేదు. అతడు హిందూస్థానపర్యటనకాలమున సంగ్రహించిన విజ్ఞానమంతను తిరుగ ప్రయాణమున దేశమునకే యర్పింప సమకట్టెను.

రవీంద్రనాథుడు బాల్యమునందు తాను నేర్చిన జ్ఞాన బోధకమైన విద్యాసముపార్జనమునే యప్పటప్పట వాగ్రూపమున వెలువరించుట బాల్యమునం దలవాటు చేసికొనెను. ఆయలవాటు వయసు హెచ్చినకొలది ఉపన్యాసధోరణిగా మారెను. అది దేశపర్యటనానంతరము శుక్లపక్ష చంద్రుని పగిది దినదినాభివృద్ధి నందుచువచ్చెను. దేశపర్యటనమునందాత డనేక తావులందు పలువిషయములనుగూర్చి యుపన్యాసముల నిచ్చెను. ఆ యుపన్యాసము లందు తాను పర్యటనమున నార్జించిన విజ్ఞానచంద్రికలను వెదజల్లువాడు.

ఈయుపన్యాసధోరణి యొకప్పుడు పలువిషయంబుల మీదను వేరొకప్పుడు కేవలము మతాభిమానము వైపునకును మరొకప్పుడు ఆధ్యాత్మిక ప్రసక్తిలోనికిని ఇంకొకప్పుడు ప్రత్యేకముగా శాంతితత్వములోనికిని పరివర్తన మందుచు నాతని భవిష్యజ్జీవితమునందలి యాశాకిరణములను పరమజ్యోతిచే వెలయించుచుండెడిది. అంతేగాక యతని ఉపన్యాసములను వినినవారికెల్ల జ్ఞానబీజోత్పన్న మయ్యెడిది.

రవీంద్రునికంటెను వంగదేశమందును ఇతరతావులందును ఉపన్యాసములను విరివిగ నిచ్చి పేరొందినవారును వినుగువిరామములు లేక యుపన్యాసముల నిచ్చినవారును గలరు. కాని రవీంద్రుని వక్తృత్వధోరణిలో గల విశేషమెట్టిదో

తెలియజాలముగాని యతని యుపన్యాసములు కొద్దిపాటివే యైనను బహిరంగముగ నుపన్యసించునపుడు బహుజనాకర్షితములై బహుళవ్యాప్తములై కర్ణపేయములగను ఎంతకాలము విన్నను ఇంకను వినవలెనన్న కుతూహలమును పుట్టించునవిగను రామణీయములగను ఆహ్లాదకరములగను నుండెడివి.

అతనియుపన్యాసరంగము పంచదారకుచీమలు మూగినట్లు వినోదక్రీడాస్థలంబులం దునికి చాలనట్లుగ జనబాహుళ్యము క్రిక్కిరిసి యిసుక వేసిన రాలనంతటి విరివిగ జనులు తండోపతండములుగ మూగువారు. రవీంద్రుని యుపన్యాసము జరుగునని ప్రకటింపబడినతోడనె ఉపన్యాసరంగమెంత విశాలమైనదైనను అనేకులు చోటుచాలక నిరుత్సాహులై వెనుకకు మరలవలసి వచ్చుచుండెడిది.

దానికితోడు రవీంద్రుడు తా నేర్చిన విద్యలన్నింటి వలెనే సంగీతమునందుకూడ స్వయముగా ప్రజ్ఞ సంపాదించెను. ఆగానకళయం దంతగా పరిశ్రమ చేయకపోయినను యతడు తన శ్రావ్యమైన కంఠమెత్తి యొక గీతమునుగాని పద్యమునుగాని కీర్తననుగాని యాలాపించెనేని జనులు నిశ్చేష్టులై తన్మయత్వమునంది చిత్తరువులవలె నుందువారు.

ఒకవంక జ్ఞానప్రబోధము, వేరొకవంక దేశపర్యటనార్జిత విజ్ఞానజ్యోతి, మరొకవంక సంగీ-సాహిత్యముల రెంటిని

సమ్మేళనము చేసి కవితాగానము సేయుట యిట్టి వాక్కుచో సమకూడుట పూర్వజన్మసుకృతముగాక మఱేమి కాగలదు. అందువలననే యతని భావిజీవితము నిష్కంటకమై నిరాశా పూరితమై నిష్ప్రమేయమై ప్రశాంతయుతముగ జ్ఞానపథమున నడిచి గమ్యస్థానమును చేరగలిగెను.

రవీంద్రుని మనోభినివేశము లనన్యములు. అతని మేధాశక్తి యేవిషయమున బ్రవేశించిన యందే ధారాళముగా పని జేసి నిగ్రహమును వడిసి కృతార్థతనొందెడిది. ఇట్టి యనన్య దుస్సాధ్యమైన శక్తిని భగవంతుం డతనికిం బ్రసాదించినాడు. మఱియు దివ్యతేజస్సంపన్నమైన యాధ్యాత్మకశక్తి నలవఱచుకొన్న ఋషిగణంబులలో కూడ నే యొక్కరో యొక్కొక్కప్పుడు పొరపాటున నింద్రియనిగ్రహమునుత్యజించి శాంతి భద్రతలను గాపాడుకొనలేక కోపధారణమున చిలిపి పనులను జేసినవారు కలవారనుటకు పెక్కు నిదర్శనములున్నవి. కాని రవీంద్రునియందవివేకము బాల్యమునుండి యేయొకప్పుడుగాని జీవితాంతమువఱకు నున్నట్లు కాన్పింపదు. దీని నేమనవలయును? దేనివలననిది యలవడినది?

అని మనలో మనము తర్కించుకొని తఱచి తఱచి, చూచితిమేని యతని కాప్రతిభ దేశపర్యటనమువలననుస్వానుభవమున నార్జించిన జ్ఞానప్రబోధమువలనను కలిగినదనినిస్సం

శయముగా జెప్పవచ్చును. వేయిమాటలేల? రవీంద్రుడు కేవలము శాంతమూర్తి. ఆధ్యాత్మికరూపజ్ఞాన విజ్ఞానగోళము కవితావిజ్ఞాననిధి, జ్ఞానపేటిక.

### కవితాప్రతిభ—ప్రచారము

నైవ వ్యాకరణజ్ఞమేవ పితరం
న భ్రాతరం తార్కికం
మీమాంసానిపుణం నపుంసక మితి
జ్ఞాత్వా నిరస్యాదరాత్,
దూరాత్సంకుచితేవ గచ్ఛతి పున
శ్చండాలవచ్ఛాందసం
కావ్యాలంకరణజ్ఞమేవ కవితా
కన్యావృణీతే స్వయమ్.''

రవీంద్రుడు బాల్యమునుండియు ప్రకృతిశోభ కాత్మీయుడని మీరు ఇంతకుముందు చదివియేయున్నారు. అతనికి బదునారవయేటనే చక్కని భాషాజ్ఞాన మలవడినది. దానికి తోడు సునితమైన మేధాసంపత్తిని భగవంతుడు ప్రసాదించినాడు. దాని కూతగ తగినంత అస్థయు, స్వాస్థయు కలిగినవి. వీని నన్నిటి నాలవాలముగ జేసికొని పిన్ననాటనుండియు కవితాగానము చేయ టారంభించెను. ఇది జీవితచరిత్రకు గీటురాయివంటిది,

బాల్యావివయః బున నెన్నికృతుల నెన్ని [illegible]ముల నెన్నిప్రశస్తుల నగచి. శేముషీప్రతిభ [illegible]యున్నిమార్గములను ద్రొక్కినాడు. మున్ముందు వచనరచన మారంభించినాడు. అటుపిమ్మట వ్యాసరచనమున కుపక్రమించినాడు. వానితరువాత గీతము లల్లనారంభించినాడు. అనంతరము కీర్తనలు గూర్చుట కారంభించినాడు. అన్నికలములతో నన్నిరూపములతో భాషాదేవి నారాధించి మొదలిడి వంగదేశమున వంగభాషలో కవితా పీఠమున కగ్రతాంబూల మందుకొనినాడు.

ఆ కవిచంద్రుని వచనరచనములలో వంగదేశమందే గాక దేశభాషలు విస్తరించిన యన్ని తావులందును ప్రశంస లందిన గద్యకావ్యములు పెక్కులు కలవు. అం[illegible] తోట వాడు, పోస్టాఫీసు? రాజర్షి, ఇంటా—బయటా, గోరా, రెక్, గృహప్రవేశమును న్నగునవి భాషాదేవికి అమూల్యాలంకా[illegible] ప్రఖ్యాతి[illegible]

అనంతరము రవి క్రమము కడుపిన్నతనంబు[illegible] సర్వ జనుల మెప్పుసంపాదింపతగిన "శిథిల హృదయము" అను రూపకమును రచించెను. శిథిలహృదయము అను పదములను గూర్చి రూపకము వ్రాయుట గొప్పకాదు, అం దాతడు చూపిన భాషాప్రావీణ్యము, పదలాలిత్యము, అర్థగౌరవము, [illegible] యుప్రతిమానశక్తి [illegible] ఘటనఘటనా సామర్థ్యమును చాటుచున్నవి.

కొలది కాలములో రవీంద్రుడొక శోక ఘట్టమున పాదము పెట్టవలసి వచ్చెను. ఇతని సోదరుడైన సత్యేంద్రనాథటాకూరు భార్య మరణించెను. ఆమె రవీంద్రుని భర్త సోదరునివలె గాక తనకడుపున బుట్టినబిడ్డవలె నాదరించెడి దట. రవీంద్రుడు అతి బాల్యముననే మాతృమూర్తిని గోల్పోయెను. అప్పటికింకను జీవులకును జీవన్మృతులకును భేదమెట్టిదో యెరుంగడు. అయినను బాల్యమునందున్న వస్త్రములకుగాని వాటి దేనికిగాని లోపము వచ్చినను తెలియునుగాని నవమాసములు మోసి కనిపెంచిన మాతృదేవి మాయమయ్యెనని యాలోపము అనుక్షణము కన్నులయెదుట తాండవించును. ఆకండ్లతడి ఇంకను ఆరకుండగనే రెండవతల్లిపగిది తన్నాదరించు సోదరునిభార్య గతించినదన్నవార్తవినగానే రవీంద్రుని హృదయమున కా సంగతి సమ్మెటపెట్టువలె తగిలెను.

అదియునుంగాక రవీంద్రుని హృదయము నిరంతరము కరుణార్ద్రమై సునితమైనదగుట నశ్రుధారార్ద్రపూరితమై వెంటనే దానిని హృదయకుహరమున జీర్ణించుకొని 'మానిసి' అను పేర నొకగ్రంథమును రచియించి తనహృదయమునందలిశోక పరితాపములను భావిలోకమునకు వెల్లడించెను. ఈగ్రంథము కవిపుంగవుని రసవంతములగు భావతరంగములతో నుయ్యాలలూగినది. ఇందు కల్పనాశక్తియు, వర్ణనా చమత్కారములు, అలంకారములు శోకరసపూరిత భావములతో నిండినదైనను

సహజభావోద్దీపకములై చదువరులను విశేషముగ నాకర్షించి వారిని విచార సాంద్రవీచీపరంపరల ముంచి లేవనెత్తి పరితాప ఘూర్ణిత హృదయులను గావించి గ్రంథలీను లగునటుల నొనర్చును.

అటుపిమ్మట టాగూరు మహాశయుడు వచనరచన మును పద్యములను వ్రాయుటతో తృప్తినొందక కొన్ని నాటకములను గూడ రచించెను. ప్రతిభాషలోను నాటక ములు రెండువిధములుగా నున్నవి. అవి దృశ్యనాటకములు, శ్రవ్యనాటకములు నని దేశమున ఖ్యాతి నందియున్నవి. దృశ్యనాటకములు చదివి సంతోషించుటకును, శ్రవ్యనాటక ములు చూచి యానందించుటకును జనసామాన్యమున కుపక రించును. ఇందు శృంగార, వీర, కరుణ అద్భుత, హాస్య, భయానక, భీభత్స, రౌద్రములనెడి నవరసములలో నేదో యొక రసమునుగాని, రెండింటినిగాని జోడించి కూర్చిన నాటకములు రంగస్థల ప్రయోగమునకును, జనాహ్లాదకర ముగ రంజించుట కుపకరించు ననుట జగత్ప్రసిద్ధమే.

ఏభాషయందుగాని, నాటకములుసర్వసాధారణముగా శృంగారరసమునకు, కరుణారసమునకు, వీరరసమునకు ప్రాధా న్యమిచ్చి రచింపబడును. ఈరసములను జోడింపవీలులేదు. దేనికది ప్రత్యేకముగా నుండవలయును. కరుణహాస్యరసము లనుజోడింపవచ్చును. ఇంకను నిట్లేకొన్ని ద్విముఖముగాచేర్చి

రచించిన జనుల నానందపఱచును. ఈపద్ధతి శ్రవ్యదృశ్యము లను రెండింటియందును ప్రయోగింపవచ్చును. కొన్ని నాటక ములు మతవిషయమునకు ప్రాధాన్య మిచ్చి రచింపబడును. అన్ని భాషలలో నేటి నాగరిక తావేశంబున సంఘసంస్కరణ లకు ప్రాధాన్యమిచ్చి రచింపబడుచున్నవి. అవి జనాకర్షణ నెక్కుడుగా బడయుచున్నవి.

ఈనాటకములలో ఖేదాంతములని, సుఖాంతములని రెండువిధములుగా భారతీయకవిచంద్రులేగాక ప్రాశ్చాత్యకవి శేఖరులుగూడ భావించి యాపద్ధతినే నాటకములను రచించి యున్నారు. రచింపుచున్నారు. ఖేదాంతములు అనగా చివర దుఃఖముతో ముగింపబడినవి. సుఖాంతము లనగా మంచితో ముగింపబడునవి. ఈవిషయములందు ప్రాశ్చాత్యకవి శేఖరు డగు 'షేక్స్పియర్' మహాకవి తనరచన లన్నిటియందును విషాదమునకే ప్రాముఖ్యమిచ్చివిషాదాంతములుగరచించెను. అతని నాటకములు ప్రపంచమంతయు వ్యాప్తమై మహో దారముగ ఖ్యాతిసందినవి.

రవీంద్రు డేకారణముచేతనో తనహృదయముననిశ్చ యించుకొని ఖేదాంతనాటకములనే వ్రాయ నారంభించెను. అది యులోకసామాన్యమైన విషయమే. అతడు వ్రాసిననాట కములలో 'చిత్రాంగద' యనునాటకము చాలపేరొందినది.

ఆనాటకమును తన సంపాదకత్వమున వెలువడుచున్న పత్రికా రాజంబగు 'సాధన'లో ప్రచురించెను. దానియందలి కల్పనా చాతుర్యము, పాత్రవివేచనము, రససంపద, భాషాలాలిత్యము వంగదేశీయులచే వేనోళ్ళ జాటబడినది. అందును ముఖ్యమైన చిత్ర మేమనగా నట సాంఘిక విషయములకు బుట్టినిల్లుగా నుండి సీతులను వెదజల్లుచు విషాదాంతముగా రచింపబడుట.

ఈ మహాశయుడు భారతీయాధ్యాత్మిక సాంప్రదాయములను విశేషముగా నాదరించువాడయ్యు నౌకాయానము మిగుల నైచ్యముగా నెంచబడెడి కాలములో నింగ్లండు దేశమునకు బయనమయ్యెను. ఇయ్యది యాతని సాంఘికాభిమానమును వేనోళ్ళ జాటుచున్నది. ఇతడు ప్రాశ్చాత్య దేశవాసం దుండియు తన మాతృభాషాసేవ నించుకంతయు నేమఱియుండలేదు. అటనుండి హిందూదేశమునకు పాటలు, పద్యములు, కీర్తనలు, కథానికలు, వ్యాసములును రచించి హిందూదేశమున కంపువాడు. ఆవ్యాసములు మొదలైనవన్నియు నాంధ్రభాషలో మాసపత్రికారాజంబగు 'భారతీ' పత్రికాముఖమున వెలువడి హైందవులచే పలువిధంబుల శ్లాఘింపబడి హిందూదేశమున వ్యాప్తమయ్యెను.

ఇంగ్లాండుద్వీపమునందు యాత్ర సలుప నిశ్చయించుకొన్న రవీంద్రుడ నప్పటిలో హూణభాషా ప్రవీణత యత్నన

సరమయ్యెను. అందుచే నాతడు తన సునిశితబుద్ధిచే నింగ్లీషు పాండిత్యము నచిరకాలములో సంపాదింపగల ననెడి ధైర్యముగలవాడయ్యెను మఱింత త్వరగా నాప్రతిభ సంపాదింపవలెనని దానికై హిందూదేశమునం దొకప్పుడు ఇండియాస్టేటు సెక్రటరీగ పనిచేసిన "జాన్ మోర్లే" గారిని దర్శించి తన యభిలాష నాయన కెఱుకపఱచగా నాతడు రవీంద్రుని మేధాసంపత్తి నిదివరకే యెఱిగియున్నవాడు కావున నితనికి హూణభాషాపాండిత్య మబ్బిన నది హూణ భాషకుగూడ నత్యంతోపకారక మగునని యందులకై పూనుకొని సహృదయముతో రవీంద్రునకు హూణవిద్య యందలి సుస్వరహాస్యములను వెల్లడించెను.

రవీంద్రనాథఠాగూరు మహాశయుడు సోదరుడైన సత్యేంద్రనాథఠాగూరుతో గలిసి అయిదు సంవత్సరములు ఇంగ్లాండుదేశమున నాంగ్లవిద్య నభ్యసించెను. అయితే సత్యేంద్రనాథుడు కేవలము ఉద్యోగాపేక్షతోనే యాచదువు చదివెను. రవీంద్రనాథఠాగూ రాభాషలోని నిగూఢరహస్యములను సర్వమును గ్రహించి భాషాసాంప్రదాయముల నెఱింగి యాభాషలోనున్న మహోన్నత గ్రంథములను మాతృభాషలోనికి పరివర్తన మొనరించి భాషాసేవ సేయు నుద్దేశముతో నాంగ్లవిద్య నభ్యసించెను.

ఆంగ్లవిద్యాభ్యాసానంతరము మాతృదేశమునకు తిరిగి వచ్చినవెంటనే సత్యేంద్రనాథుడు ఇండియన్ సివిల్ సర్వీసున కెన్నుకొనబడెను. హిందువులలో నప్పటి కాపదవి కెన్నుకొనబడినవారిలో నతడే మొదటివాడు. రవీంద్రుడు నాటి నుండి జీవితాంతమువఱకు భాషాసేవయే పరమావధిగా నుంచుకొని భాషాసేవకుడుగ నుండి తన మహోన్నతోదార భావములను గ్రంథమూలకముగను, ఉపన్యాసముల మూలమునను దేశీయులకు వెల్లడించి భాషాసేవకులలో నగ్రగణ్యుడనిపించుకొనెను.

ఆ కాలమున రవీంద్రునిగృహము లక్ష్మీసరస్వతుల కాటపట్టయి యుండెనని వక్కాణించుట కేవంగీయుడును ఇంచుకేని సంశయింపడు. మఱియు నామహనీయుడు తొలుదొల్త మాతృభాషలో సర్వజనరంజకంబులగు చక్కని గ్రంథములను రచించి హూణభాషాపాండిత్య మలవఱచుకొనిన పిమ్మట వాని నాంగ్లభాషలోనికి బరివర్తనము చేసియు నాంగ్లభాషలోని యుద్గ్రంథములను మాత్రుకలు చెడకుండగ తన భాషలోనికి భాషాంతరీకరణమును జేయుచుండెను.

రవీంద్రు డీయుద్యమము నారంభించినను భాషాసాంప్రదాయసిద్ధములుగనే చాలవఱకుండెడివి. ఒకవంక గ్రంథరచనము, వేరొకవంక అన్యభాషాగ్రంథములనుమాతృభాషలోనికి పరివర్తన మొనర్చుట, మఱొకవంక మాతృభాషలోని

గ్రంథములను అన్యభాషలోనికి మార్పుట చేయుచునే యెంత యుత్సాహము కలవాడు కాకపోయిన ఇంద్రియనిగ్రహశక్తి కలవాడగుట నేకముఖమున నిన్ని పనులను సాగించుచు స్వయం సంపాదకత్వమున పత్రికలను వెలువరించి యందు తనరచనలను వ్యాసములను ప్రచురించువాడు. ఆ భాషాసేవకుడు సంపాదకుడై నడపిన పత్రికలలో పేన్నదగినవి నాలుగుకలవు. అవి భారతీ, బాలకా, సాధనా, వంగదర్శన యనునవి. ఇవియే యతడు వంగదేశమున కేగాక యావద్భారతావనికిని విశాల జ్ఞానచక్షువు నొసంగుటకు ఏకైకసాధనము లైనవి.

## విదేశయాత్ర

"కళారత్నం గీతం శ్రవణసుఖ
రత్నం హరికథా
రణే రత్నం వాజీ గగనతల
రత్నం దినకరః
నిశారత్నం చంద్రశ్శయనతల
రత్నం శశిముఖీ
సభారత్నం విద్వాన్ నృపతి
కులరత్నం రఘుపతిః."

రవీంద్రనాథటాగూరు మహాశయుడు ప్రప్రథమున విద్యాభ్యాసము నిమిత్తమై యింగ్లాడున కేగెను. రెండవ

పర్యాయ మాతడు తన సర్వభాషా పాండితీగరిమను, కవితా విశేషమును, ఉపన్యాసవీచికల మూలమున ఆంగ్ల దేశీయుల కెఱుకపఱప దలచి యింగ్లాండునకు పయనమయ్యెను. అతడు తన యింగ్లాండు రెండవ ప్రయాణ సమయమున బాహ్యదృష్టి ముగా నొక యోగీంద్రునివలెను, ఒక మహర్షి భాతి, ఒక సర్వ సంగపరిత్యాగివలె బయలు దేరెను. అప్పటి యామహానీయుని ఛాయాచిత్రమును జూచితిరవలయును. ఈనాటి త్యాగధనుల మాట యటుంచి ప్రాచీనకాలపు ఋషిపుంగవుల శాంత మూర్తిత్వ మందు గోచరించును.

ఇంగ్లాండునకు రెండవమాఱు పయనమగు కాలమున కా ప్రభాశాలి 'గీతాంజలి' యను కావ్యమును చాలవరకు వ్రాసియుంచెను. తక్కిన దానిని నౌకాప్రయాణ కాలమున ప్రశాంతసమయములం దేకాంతవాసుడై నిర్మలమనస్సుతో నింగ్లాండు చేరుసరికి పూర్తి చేసెను. అందు తాను రచించిన గ్రంథము లన్నిటియందు నున్న వేదాంత బోధకములును, భక్తిప్రబోధకములునైన గీతములను వంగభాషయందే మొదట రచించెను. పాశ్చాత్య దేశముల కరిగిన పిమ్మట దానిని ఆంగ్లభాషలోనికి భాషాంతరీకరణ మొనర్చెను. అయి దేం గ్లాండ్విద్య నభ్యసించి నంతమాత్రాన నట్టి యుత్కృష్ట విషయములు గల మాతృభాషా గ్రంథమైనను నూతనభాష లోనికి పరివర్తన మొనర్చు ప్రజ్ఞ కలుగునా ?

తాను రచించిన గీతాంజలి కావ్యము నొకప్పుడు తన కక్కడ పరిచయుడైన యాంగ్ల కవిశేఖరుండగు 'రాధన్ స్టీన్' అను నాంగ్లకవికి ప్రసంగవశమున జూపించెను. ఆ కవిశేఖరు డా గ్రంథము నందుకొని ఘుణాక్షర న్యాయమున దానిని బరిశీలించి, యందలి సారస్వత ప్రణాళికకును, భావోద్రేకమునకును, వచనా చాతురీధురీణతకును, ప్రబోధతత్వమునకును కడుంగడు మెచ్చుకొని యా గ్రంథమును కండ్ల నద్దుకొని రవీంద్రుని మ్రోల నొక దాసానుదాసునివలె నిలచి యతనిని గాఢ పరిష్వంగనము జేసికొనెనట.

ఆ కవిసత్తము డంతతో నుపేక్షింపక దాని ననేక ప్రతులుగా టైపుచేసి తనమిత్రులకును, ఆంగ్లదేశమునందు, సుప్రసిద్ధ కవిశేఖరులమని గుండెల గొట్టుకొని, రొమ్ములు విరుచుకొని మాయంతవారు లేరను విఱ్ఱవీగువారిలో గొందఱకును పంపించెను. వా రందఱు రామూలాగ్రముగ నా గ్రంథమును బఠించి మిగుల సంతుష్టాంతరంగులై రవీంద్రుని ప్రతిభను వేనోళ్ళ బొగడిరి. ఆ ప్రఖ్యాతి యత డింకను కొన్ని పాశ్చాత్య సీమల కరుగుటకు మూలకారణ మయ్యెను. 'రాధన్ స్టీన్' మహాశయుని ప్రోత్సాహమున రవీంద్ర కవిశేఖరుడు యింగ్లండులో నమూల్యములైన యుపన్యాసములను గొన్నిటి నిచ్చెను. ఆయుపన్యాసప్రవాహమునకు ఆంగ్లేయులు ఆశ్చర్య చకితమానసు లగుటయేగాక పలువురు జిచ్చవడిరట.

ఈ ప్రతిభాశాలి యొకమారు జపాను దేశమున కరిగె నట. అప్పటి కప్పుడే రవీంద్రుని యశోవల్లికలు జపాను దేశ మంతటను ప్రాకియుండెను. అయితే టాగూరుమహాశయుడు చాల క్లిష్టమైన వేషభాషలతో పోయెడువాడు. ఆడంబర మాతనికి గిట్టదు. అసూయ ఆమహాత్ముని గొనగోటికైన లేదు. రవీంద్రుని వేషభాషలను దిలకించిన జపానీయులలో గొంద రెట్టెట్లో భావించిరట, రవీంద్రుడు తమ దేశమునకు వచ్చుచున్నాడను సంగతి వినినతోడనే యచటివిద్యావేత్తలు, తత్త్వ శాస్త్రపండితులు, కవిశేఖరులు, పరిశోధకులు, అదివఱకు యిండియాలో గొంతకాలముండి భారత భూమి యందలి నీరమును ద్రావి యిందలి సర్వవిషయములను జవి చూచియుండిన కొందఱును గలిసి రవీంద్రునకు గొప్ప స్వాగత మిచ్చి పలువిధంబుల గౌరవించిరి.

అచట నొకమహాసభలో రవీంద్రుడు ''జాతీయము'' అను విషయమై నాలుగైదుగంటల కాలము ఏకధారగా మహోపన్యాస మొనర్చెను. ఆ యుపన్యాససభకు సుమారు యిరువదివేలమంది ప్రజలు వచ్చిరట. అందు జపాను దేశము నందలి వివిధశాఖలలోని ప్రముఖులు కలరట. ఆయుపన్యాసా నంతరము రవీంద్రటాగూరు మహాశయు నొక దివ్యపురుషు నితో బోల్చి యచటి మహామహు లెంతో పొగడుచు సర

గంటకాల ముపన్యసించెనట. ఆతని ప్రతిభ విదేశములందు ప్రాకెననుట కిది యొక యుదాహరణముకాదా?

అటనుండి అమెరికాదేశమున కేగెను. అచట ననేకములైన శీర్షికలమీద మహోపన్యాసముల నిచ్చెను. అమెరికాదేశీయు లిదివరలో హైందవాగ్రగణ్యులలో నతి ప్రముఖులైన వివేకానందాదుల యుపన్యాసములను జవిచూచి యున్నవారైనను రవీంద్రుని యుపన్యాసములను వినునప్పుడు చిత్రపటములవలె నిశ్చేష్టులయిరట. అతని యుపన్యాస ధోరణిలోని ప్రశాంతత్వము, జాతీయనిర్మాణగమనిక, ఆ యొడుదుడుకులు లేని కంఠస్వరము, కనుబొమలుకూడ ముడిపడనట్టి త్యాగము, వాక్చాతుర్యము, ఆకర్షణాకౌశలము అమెరికాఖండవాసుల నానందసముద్రమున నోలలాడించినదట.

ఆ యుపన్యాసముల సారాంశమంతయు నిందుదహరించుట శక్యముగానిది. అంతేగాక అప్రస్తుతము. దానిని ప్రత్యేకసంపుటములుగా ముద్రింపబడిన గ్రంథమందే కానవగును. అదియు సర్వజన సామాన్యమున కందుబాటులోనే యున్నది. అమెరికాఖండవాసుల జోహారు లందుకొన్న రవీంద్రనాథటాగూరు మహాశయుని జీవితము ధన్యమని నొక్కివక్కాణించుచున్నాము. హిందూదేశమునుండి యమెరికాదేశమునకు బోయి ఉపన్యాసవాహినుల నాదేశమందు

ప్రవహింప జేసినవారిలో టాగూరు మహాశయుడు వివేకోత్పన్నుడని, శాంతమూర్తియని జ్ఞానానందుడని బొగడబడుటయు హైందవుల యౌన్నత్యమునకు గారణమయ్యెనని వచించు టతిశయోక్తి కాజాలదు.

అమెరికా ఖండమంతను తన యుపన్యాసప్రవాహధోరణిచే నప్రమాణ మూగించి టాగూరు మేధావి తిన్నగా మాతృదేశమునకు మరలివచ్చుచు మధ్యేమార్గంబునం దనేక పట్టణప్రముఖులచే నాహ్వానింపబడి ఆయానగరములం దుపన్యాసముల నిచ్చుచు పిదప కలకత్తానగరమునకు విచ్చేసి తన విజ్ఞానము నటకూడ వెదజల్లి యటనుండి కొంతకాలము విశ్రాంతి గైకొనెను.

పిమ్మట గొంతకాలము శ్రద్ధవహించి మతవిషయమున కాలిడెను. ఆ విషయమందుగూడ నతడు నూతనమార్గమును ద్రొక్కకపోయినను తమవంశీయులలో నగ్రగణ్యులైనవారి యడుగుజాడలలో నడువదలంచి దేశపరిస్థితులను గమనించి వంగదేశమంతను నొక్కపరి సింహావలోకనముచేసి మత ప్రచారమునకు గడంగెను. అప్పటికప్పుడే శ్రీరాజర్షి రాజా రామమోహనరాయ వారి యప్రతిమాన శేముషీ మహిమంబున వంగదేశమందేగాక తత్ప్రాంతములందుగూడ బ్రహ్మమతముచాల యభివృద్ధిలోనుండెను. వంగదేశమున నీమతమునకు

ప్రప్రథమమున పునాది వేసినవాడు శ్రీ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ మహాశయులు. ఆపునాదులమీద నిలబడి తత్సోపానముల కాలూని బ్రహ్మమతమును దివ్యమైన మార్గమున నడిపించినది రాజారామమోహనరాయలవారు. అటుపిమ్మట నింకను బెక్కుమంది యందు పనిజేయుచునే యున్నారు. రవీంద్రనాథ మహాశయుడుకూడ దానిపై తన సునిశితప్రజ్ఞను జూపనెంచి యందు ప్రవేశించెను.

## శాం తి ని కే త న ము

"నీరము తప్తలోహమున నిల్చి
యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళ సం
స్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోబడి మణిత్వము
గాంచు సమంచితప్రభ
పౌరుషవృత్తు లిట్లధమ మధ్యము
నుత్తము గొల్చువారికిన్."

రవీంద్రనాథటాగూరు మహాశయుడు బాల్యము నుండియు పితృపాదుల యడుగుజాడలలో నడచివవాడగుట నన్ని విషయములందును పితృమూర్తిని బోలి తుదకు మత సన్ని

వేళ మందుగూడ తండ్రినే యనుకరించి యానాటి వంగదేశ పరిస్థితుల ననుసరించి బ్రహ్మమతాభిమానియై కలకత్తా యందలి బ్రహ్మసమాజమునకు కొంతకాలము కార్యదర్శిగా నుండి తన్మత ప్రచారమున కమోఘముగ బనిచేసెను.

ఈకవిశేఖరుడు వంగరాష్ట్రములో దన పూర్వుల నివాస గ్రామమగు భోలూపురునం దొక విశ్వవిద్యాలయమును స్థాపించెను. దానికి 'శాంతి నికేతనము' అని పేరిడెను. రవీంద్రుని తండ్రి తన చిఱుతప్రాయంబున నిట్టి విద్యాలయము నందే యేకాంతసేవచేసి ఆధ్యాత్మికతత్వ జ్ఞానసిద్ధు డయ్యెను. అది హృదయసీమ నుంచుకొనియే యీ మహనీయు డట్టి విద్యాప్రణాళికను జాతిమతభేదముగాని, రంగుభేదముగాని లేకుండ విద్యార్థులకు జ్ఞానప్రబోధము చేయుతలంపున దీనిని స్థాపించెను. ఇందు సనాతన హైందవ విద్యాపద్ధతులు సనాత నాచారములతో నధునాత నాచారములను జోడించి విద్యను జెప్ప రవీంద్రు డుద్దేశించెను. అతనివాంఛ యెంతవఱకు సఫల మయ్యెనో చదువరులు ముందెఱుంగ గలరు.

ఈ శాంతినికేతనము సార్థక నామము కలదనిపించుకొని యావద్భారతభూమిని శాంతికి నిలయ మని విఖ్యాతి నందెను. ఈవిద్యాలయము దాదాపు తొల్లింటి ఋషిపఠనమందిరముల ననుసరించి నడుపబడుచుండెను. ఇందు విద్యార్థులైన బాలుర

గురుముఖమున విద్య నభ్యసించి విశుద్ధమగు 'బ్రహ్మచర్య మత'మవలంబించి యుండవలెను. బ్రహ్మచర్యదీక్ష వహించి తమ జీవితమును పవిత్రము చేసికొన దలచుకొన్నవారి కీవిద్యాలయము శరణాలయముగ నొనర్చి దానిని జయప్రదముగ నిర్వహింపవలె ననువాంఛ పుట్టి దానికై తన యావద్విశిష్టతను ధారవోసి యితరులసహాయము నించుకేని యపేక్షింపక ప్రారంభించెను. ఈయన జన్మసాఫల్యమున కెక్కుడుగ సాధనంబైనదియు పలువుర విద్యావంతులను భరతభూమియందు నూతన తేజముతో సృష్టించి యిచ్చినదీ సద్భావసంయుతమైన వాంఛయే.

అనేక విషయములందు దుస్థితిం దొప్పదోగు నీభరతఖండము నుద్ధరింప ననువుపడు మహోపకరణములలో స్వదేశోద్యమ మొకటియని వేఱుగ జెప్పనక్కరలేదుగదా. ఏ మహనీయు డెంతెంత కష్టములను పడియైనను భరతఖండమును హానిసత్వమునుండి యుద్ధరింప దలపెట్టినను యట్టి వారికెల్ల మహాసాధనమైన యుపకరణములలో నగ్రగణ్యామిదియేకదా! వంగదేశమునం దత్యంతవ్యాప్తమైన యీ స్వదేశోద్యమమునకు రవీంద్రుని దేశభక్తి ప్రపూరితములగు మధుర గీతములును, సజీవనోపన్యాసములును, ప్రోత్సాహరచనలును, ముఖ్యాధారములైనవి. దానికితోడుగ నీశాంతినికేతనము మహాదోహదమై రవీంద్రుని యశశ్చంద్రికలను

భారతభూమి యందేగాక ఖండఖండాంతరములకు గూడ యనంతప్రభలతో చుట్టుముట్టి విశేషాకర్షణశక్తితో నన్య ఖండములందలి విద్యార్థులను కూడ తన నికటమునకు రప్పించుకొని వారికి జాతీయ సుధను చిలికి గ్రుమ్మరించినది.

ఈ విశ్వవిద్యాలయమున నాడంబరమునకు తావు లేదు. కపటకృత్యములకు కాణాచి కాలేదు. విద్యార్థులను దేశసేవకును మతప్రచారమునకును జాతీయతత్వ విషయ సంస్థాపనకును మూలకందములుగ నొనర్చుటే యీ విశ్వవిద్యాలయస్థాపనోద్దేశము. ఇందలి విద్యార్థులు మునికుమారులవలెనె సూర్యోదయము కాకముందే స్నానమొనర్చి భగవద్ధ్యానము నాచరించి విశ్వవిద్యాలయ ప్రాంగణమున భరతమాతృస్తవ మొనరించి తదావరణమందలి కుసుమపల్లవిత వృక్షచ్ఛాయల గూర్చుండి గ్రంథపఠన మొనర్చి వేళకింత యుపహారము నాకొని నిరంతరము వివిధ విద్యాసముపార్జనముల దృష్టినుంచి తీరికవేళల సారస్వతచర్చతో కాలమును వెళ్ళించుచు గురుకులమును గురువులను గురుపాదులట్లు గౌరవింపుచు నాగురుపాదుల యాజ్ఞల తలదాల్చి మెలంగుదురు.

శాంతినికేతనపు టౌన్నత్య మీవిశాల ప్రపంచమున నఖిలదిశల తన విజయభేరిని మ్రోగించిన దనుటకే చెప్పబడు నిదర్శన మొక్కటి దానిని గమనింపుడు. ఈ విశ్వవిద్యాలయ

ము॥ భరతఖండమందలి విద్యార్థులేగాక పాశ్చాత్య దేశము లలో విద్యావేత్తలకును పరిశోధక మనీషులకును నిలయమని పించుకున్న జర్మనీ, చైనా, అమెరికా మొదలగు ఖండాంత రము లందలి విద్యార్థులును హైందవసోదరులతో గూడి కలిసి మెలిసి భ్రాతృవాత్సల్యమున మెలంగుచు విద్యా వ్యాసంగ మొనర్చుచుండిరి. అంతేగాక యప్పుడప్పుడు ఖండాంతర వాసులలో నగ్రగణ్యులని యందెలువేసికొన్న విద్యావేత్తలు విశ్వవిద్యాలయ ప్రాంగణమున నడుగిడి యందలి శాంతితత్వమునకు నిశ్చేష్టులై యచటి గురుపాదుల పాఠకవాచక విద్యాబోధనా నైపుణ్యమునకు తలలూచి ప్రశంసించి రవీంద్రుని ప్రతిభావిశేషమును పత్రికలందును, ఉపన్యాసరంగములందును వేనోళ్ళ నుతించువారు. ఎందఱు మహానీయు లీభరతఖండమున బుట్టిగిట్టలేదు. ఎన్ని విద్యా లయములు కట్టబడి మట్టిపాలు కాలేదు, చిరస్థాయి కాలేక పోయెనే? రవీంద్రు డొక్కడే యీ విషయమున ధన్యుడు.

### దేశీయ విదేశీయ బిరుదములు

"క్షీరము మున్ను నీటి కొసగెన్ స్వ
గుణంబులు తన్ను జేరుటన్
క్షీరము తప్తమౌట గని చిచ్చురికెన్
నెతచే జలంబు దు

ర్వారసుహృద్విపత్తి గని వహ్ని
చోరం జనె దుగ్ధ మంతలో
నీరముగూడి శాంతమయి నిల్చు మ
హాత్ములమైత్రి యీగతిన్."

రవీంద్రనాథటాగూరు మహాశయుడు శాంతినికేతన స్థాపనమువలన నార్జించిన యశశ్చంద్రికలును, కవితాసేవచే సముపార్జన మొనర్చిన యశోవల్లికలును దశదిశలను నిండి యతని నొక యపూర్వప్రతిభాశాలిగ జాటె ననుటలో నాశ్చర్యమేమున్నది? ఇంగ్లండున కేగినపుడు రాథన్‌స్టీన్ అను నాంగ్లకవి రవీంద్రరచితగీతాంజలిని చదివి మహా దానందపూరిత హృదయుడై విపరీతాశ్చర్య మనస్కుడై రవీంద్రు నెంతో ప్రశంసించి యాగ్రంథమును తన దేశములో నున్న కవికోటి కెల్లరకు ప్రతులను బంపెను. ఆ ప్రచారము మూలమున రవీంద్రుని మేధాశక్తిని భారతభూమియందలి ప్రజలందఱును గ్రహించుటయేగాక దొరతనమువారుకూడ గ్రహించిరి.

అట్టి మహానీయుని బూజించుట తమవిధ్యుక్తధర్మమని తలంచి 'నైట్' అను బిరుదము నొసంగి గౌరవించిరి. తరువాత గొలది కాలమునకు జగద్విఖ్యాతమైన 'నోబెల్' బహుమానము నతడు బొందగలైను. పిదప వంగరాష్ట్రమందలి విశ్వవిద్యాల

యము (కలకత్తా). వారు ఈమేధానిధికి దేశసేవాతత్పరతకై 'ఎల్. ఎల్. డి' అను బిరుదము నొసంగిరి.

భరతఖండవాసులలో నంతటి చిన్నవయసులోనోబుల్ బహుమాన మందుకొన్నవారు లేరు. అయితే టాగూరువంటి దేశభక్తుడు దేశసేవాతత్పరుడును ఈబిరుదముల నెట్టియుద్దేశముతో స్వీకరించెనో మన మెఱుంగవలసియున్నది. ఇది మన కప్రస్తుతమేయైనను నేటి కాలపరిస్థితులనుబట్టి మాత్రమే కాక రవీంద్రుని జీవితపరమావధిలో కాలయాపన పరిస్థితులను బట్టియు దేశమండలి రాజకీయ పరిస్థితులనుబట్టియు తెలిసికొను టావశ్యక మనియే భావింపవలసి యున్నది.

మన దేశమునం దీబిరుదుల ఉత్సాహము, ఉబలాటము ప్రాకులాట యిరువదియవశతాబ్దారంభమున నెంత యుద్రేకముతోను, ఉద్వేగముతోను, నుండెడివో యేకొలది పాటి రాజకీయ పరిజ్ఞాతకైనను, కించిజ్జ్ఞుడైన విద్యావంతునకైనను తెలియకబడియే యున్నది. బిరుదులను బొందువారిలో గొందఱు దానికై యత్యధికమైన కృషిని సల్పువా రున్నారు. మఱికొందఱు తాము బయటపడక యితరులచే పనిచేయించి సంపాదించి తగిలించుకొన్నవా రున్నారు. వేఱుకొంద ఱయాచితముగా వచ్చినదానిని విడుచుటేల యని గ్రహించినవా రున్నారు. ఇంకను గొందఱు వచ్చిన బిరుదమును తీసి

కొనుటా తిరస్కరించుటా యని తర్కించి తర్కించి చేకొన్న వారును గలరు.

అయితే రవీంద్రు డిందలి యే తెగకును చెందినవాడు కాడు. అతడు పొందిన బిరుదములుకూడ యిట్టివాతావరణ మున దొరకొన్నవియు కావు. 'నోబుల్' బహుమానము సాధారణముగా జగన్నుతిగన్న గ్రంథరచయితలకే యిచ్చుట కేర్పడియున్నది. అప్పు డప్పుడు లోకఖ్యాతి నందిన పరి శోధకులకుగూడ యిచ్చుట కలదు. ఇంక 'నైట్' బిరుదము కూడ నట్టి తెగకు చెందకపోయినను మిగుల నధికమయిన గౌరవంబును, విలువయును గలదే. రవీంద్రుడు పొందిన విశ్వవిద్యాలయ బిరుదమున్ను సారస్వత సంబంధమైనదే. సారస్వత పరిశోధక సంబంధమైన బిరుదులనందు టెన్నడును ఆక్షేపణీయము కాదు. అందుచేతనే మహావిజ్ఞానియైన రవీంద్ర నాథటాగూ రీబిరుదములను ఇతోధిక గౌరవముచే నందు కొన్నవాడని మన మెంచగలము.

ఈవిషయమునజరిగిన యొక విచిత్రము విపరీతమునైన సంగతి నిట వ్రాయకుండ నుండు టపచారమే యగును. క్రీ. శ. 1919 వ సంవత్సరమున అమృతసర్ నగరమునందు దొర తనమువారుఏదోయొకస్వల్ప కారణమునకై నిరాయుధులును, నిరపరాధులునైన ప్రజాబాహుళ్యముపై తుపాకిగుండ్లను

బారుచేయించి కాల్పులను కాల్పించి నగరవీథు లన్నింటను రక్తపాతమును గలుగజేసినారు. ఆసంగతి రవీంద్రనాథ ఠాగూరుమహాశయుని చెవిని బడినంతనే మిగుల విషణ్ణహృదయుడై పరితపించి యెంతో దూరాలోచనము చేసి యావిషాద సంఘటనమునుగూర్చి ప్రభుత్వమున కొక విజ్ఞప్తి నంపెను.

అది భారతప్రభుత్వమువారి చేతులమీదుగా సరాసరి పార్లమెంటునకు బోవలసియున్నది. ముందుగా నది యప్పటికి వైస్రాయి (గవర్నర్ జనరల్) అయిన 'ఛెలమ్స్ఫర్డు' నకు జేరెను. అందు కొంతభాగమును రవీంద్రుడు కోపారుణిత లోచనుండై వ్రాసినట్లు కన్పట్టుచుండెను. వైస్రాయి దాని నామూలాగ్రముగ చదివి నిర్లక్ష్యముగ జూచెను. ఆసంగతి రవీంద్రున కెట్లో తెలిసెను. వెంటనే యీదేశభక్తుడు తనకు దొరతనమువా రతిగౌరవముగ ప్రసాదించిన 'నైట్' బిరుదమును విసర్జించెను. అతడెంత మహాత్యాగియో చూడుడు. దీనినిబట్టి యీమహనీయునకు బిరుదములం దెంతటి యాశ యున్నదో పాఠకమహాశయులు గ్రహింపుడు.

## అస్తమయము

"విశ్వప్రపంచైక విజ్ఞానఫలదంబు
వేదకల్పక ముద్భవించుపాడు

సంకల్పమాత్ర తక్షణ జగన్నిర్మాణ చణ
తపోధనుల కాశ్రమపదంబు
సత్యరతా దిదృతా దీక్షితులైన హరి
శ్చంద్రాదు లేలిన సవనభూమి
పరశురామద్రోణపాండవేయాది కాం
డీరవీరులగన్న వీరమాత

గాంగలహరీతరంగ సంక్షాళితోచ్చ
మానవాళఘపంకమా మాన్యసీమ
శంకరాదిమతాచార్య జన్మభూమి
భరతఖండంబు భువనైక పావనంబు."

భరతఖండమందలి పుణ్యావంతమైన భూభాగమందెంత మంది మహనీయు లుద్భవించి తమ యశశ్చంద్రికలచే దశ దిశల నావరించి తిరిగి కొంతకాలమునకు ఇహలోకమును వీడి స్వర్గసీమ నలంకరించుచున్నారో మన మెఱుంగుదుము. అట్టి వారందఱు భూలోకమునకు నిఖలవిషయంబులందును మకుటాయమయిన భారతమాత పుణ్యగర్భంబున జన్మించి యా దేవికంఠసీమను ముక్తిముక్తాఫలంబులలో విరాజిల్లు హారావళి యందు తారలవలె వెలింగి యెల్లపు డాకేలోకమందుండుట భావ్యము కాదని కాబోలు పరలోకమున కరుగుచుందురు. ఇట్లెన్ని రత్నము లాదేవిమణిహారమునుండి రాలిపోయినవో!

అందు భారతభూమియందు వంగరాష్ట్రమునకు చేవె లుండై జన్మించి పసితనముననే స్వీయమేధాప్రతిపత్తితో జ్ఞాన బోధకప్రజ్ఞను గడించి వంగరాష్ట్రమందు వంగభాషయందే గాక వివిధదేశభాషలందును కవితాగాన మొనర్చి పురాణ భాషయందుగూడ నపారప్రజ్ఞ నార్జించి తనయుపన్యాసస్ఫూర్తి వేగమున స్వదేశీయులను ఖండాంతర వాసులను మహదా నందమున ముంచి తనగ్రంథరచనా కౌశలంబున విఖ్యాత యశోవల్లరుల వివిధగమనములతో కవితాలతల బ్రాకించి బ్రాహ్మణమతాభిమానియై ప్రాచీనగురుకులంబుభాతి శాంతి నికేతనమును స్థాపించి ఖండాంతరములందున్న విద్యావేత్త లనుగూడ తనవిద్యాలయ ప్రాంగణమునకు హైందవసాంప్ర దాయాభ్యసన మభ్యసింప వచ్చునట్లుచేసి పత్రికాప్రచురణం బున భాషాదేవిని వివిధగతుల నారాధించి దేశసేవాతత్పరు డని విఖ్యాతినందిన ప్రతిభాశాలి, తన శేముషీ ప్రభావంబున నోబెలుబహుమానమును బొంది జగద్విఖ్యాతిని గాంచిన పరమపావనుడు, తలంచినంతమాత్రముననే భారతరాష్ట్రీయ ప్రభుత్వముతో నొకరక్తపాతకార్యమున వాగ్వివాదముసల్పి వైస్రాయితో డీకొని దొరతనమువా రనాహూయమూన ముగ 'నైటు' బిరుదమును తృటికాలములో విడనాడిన మహాత్యాగి, సత్యదీక్షాసంపన్నుడు, బ్రహ్మచర్యవ్రత నిష్ఠా గరిష్ఠుడు, మహోపకారియు, ధన్యాత్ముడును ధన్యజీవనుడును

సుకృతరాశి శ్రీ రవీంద్రనాథ టాగూరు మహాశయుడు 7—8—1941 సంవత్సరమున భారతీయుల నపారశోక వారధిలో ముంచి స్వర్గసీమ నలంకరించెను.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

సంపూర్ణము.



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.